కథ




డా॥ సిద్దెంకి యాదగిరి

# శవకీయం

"ఆస్తులు పంచుకుంటారు. ఆత్మీయతలు ఎందుకు పంచుకోరు? ముక్కు తీయలేదా? ముడ్డికడగలేదా? కనలేదా? పెంచలేదా? సాది సవరియ్యలేదా?ఉట్టిగనే పెరిగి పెద్దైనారు?" అని కత్తి కనకవ్వ పిల్లల గురించి ఊరు ఊరంతా అక్కసు వెళ్ళగకుతున్నారు. అద్దాలనాడే పిల్లలు గడ్డాలనాడు కాదని, తలా ఒక రీతిన తర్కిస్తున్నారు. చర్చించుకుంటున్నారు.

వాంతికి వచ్చే వాసనలో నలుగురు పిల్లలు వంతుల వారీగా సేవచేసి వారికి వారే విముక్తి ప్రకటించుకున్నారు. అందువల్ల కత్తి కనకవ్వ క్యాన్సర్‌తో పోరాడుతూ ఇప్పుడో... ఇంకాసేపట్లో... అన్నట్లు హాస్పిటల్లో బెడ్‌పైన సోలిపోతుంది. ఆమె భర్త రామయ్య ఒక్కడే అనాథలా పడివున్న కనకవ్వతో ఆయాసాన్ని చూసి దుఖిస్తున్నాడు.

రెప్పకొట్టని కనకవ్వ కళ్ళు సీలింగ్ ఫ్యాన్‌ని అదేపనిగా చూస్తున్నాయి. రామయ్యకు ఎందుకో భయమేసి, పరిశీలించి చూశాడు. శ్వాస ఆడుతలేదు. ముక్కుదగ్గర వేలుపెట్టి చూశాడు. ఇంకేముంది?

"కనకము.... నా కనకమూ. నన్ను ఆగం చేసి పోతివా? అడవిలో కలిపి పోతివా" అని బిగ్గరగా ఏడుపందుకున్నాడు. రోదనకు హాస్పిటల్ అంతా దద్దరిల్లింది.

"ఓరి ముసలొడా? ఏం రోగమ్రా? సచ్చి అది సంపుతుంది. ఏడ్చి నువ్వు సంపుతావురా?" అని తిట్టి నోరు మూయించారు.

శవాగారంలోంచి పార్థివ వాహనం కదిలి ఊళ్ళోకొచ్చే వరకు కనకవ్వ మరణ వార్త ఎవరికి తెలియలేదు. వాహనం దారి తీసుకుంటూ ఈదమ్మవాగుకు వచ్చి ఆగింది.

ఆ తెల్ల వ్యాన్ పైనున్న నవ్వుతున్న మీసాల ఫోటోను పార్వతమ్మ చూడగానే పక్కనే ఉన్న కంకరరాయితో అద్దం పగలగొట్టాలనీ అనిపించింది గాని ఎందుకని ఊకున్నది. పాము కరిచి చనిపోయిన తన బిడ్డని దవాకాన నుంచి మనసు మత్తడి తెగిన దుఖంతో తీసుకొచ్చేటప్పుడు ఒక ఫోటో అట్లాగే వెక్కిరించినట్లు నవ్వింది గురుతుకొచ్చి.

పాత పెంకుటిల్లు ముందు స్ట్రేచ్చర్ మీద కనకవ్వను దించి వాకిట్లో పరుండబెట్టారు. చూడటానికి దడిగట్టారు

"అయ్యో... కనకక్కా... బావను కాటకలిపే పోతివా....అక్కా? వీరిద్దరు పచ్చోలోలే కూడిన్నరక్కా..." అంటూ ఇద్దరు యారాండ్లు ఒగలమీద ఒకలుపడి ఏడుస్తున్నారు.

కనకవ్వ చచ్చిన వార్త వాట్సప్ గ్రూప్‌లలో చక్కర్లు కొట్టడమూ, ఫోన్లద్వారా తెలుసుకొన్న కొడుకులు, కోడళ్ళు మనవరాలు ఆమె సంతతి, కులపొల్లు, పాలివాళ్లు బెల్లం చుట్టూ ఈగల్లా చుట్టుకున్నారు.

కనకవ్వ జీవాత్మ ఇక్కడే ఉందని శవం తలాపున కుందెన కింది దీపం గుడ్డిగా వెలుగుతోంది. గ్లాస్లో బియ్యం పోసి అంటించిన ఊదుబత్తీల పొగ గాల్లోకి తెరలు తెరలుగా గీతలు గీతలుగా వ్యాపిస్తుంది. కప్పిన బట్టకింద కడుపుమీద పెట్టిన డాంబర్ గోలీల ఘాటు, సెంట్ వాసనతో శవం వాసన కలగలిపిన ఒకలాంటి వాసన వీస్తుంది. నోరు తెరవకుండా దవడలు బిగ్గరగా గుంజి తువ్వాళతో కట్టారు. ముక్కులో పత్తి కనపడుతుంది. కాలి బొటనవేల్లు ముడి వేశారు.

శవం సుట్టూ కూర్చోవాల్సినవాళ్లు దూరాన దూరం, దగ్గరకు దగ్గరన్నట్లు కూసున్నరు. అన్నదమ్ములు ఎవలంతల వాళ్ళు ఒకల మించి ఒకలు పోటీపడి ఏడుస్తుంద్రు.

బిడ్డ లసుమవ్వనే ముగ్గురు అన్నలదగ్గరికి పోయి "అవ్వ వొయిందే అన్నో... అన్నా... మన అవ్వ కనవడదే... అన్నో... మావ్వ వొయిందే వొదినే..." అని ముగ్గురు అన్నల మీద ముగ్గురు వదినల మీదపడి ఒకటే తీరుగా వలపోస్తుంది. కడుపులో ఎంత కపటం ఉన్నా, వదినలు లోకం బాధకు ఏడుస్తున్నారు కన్నీళ్లు రాకున్నా...

"అ..వ్వో... ఓ.. అ..వ్వ నాయినను ఒక్కన్ని చేసిపోతివా... నాయినా.... ఓ... నాయినా... మా..వ్వను ఏడ తొలితివే నాయినా ....." అని అంటుండుంగానే....

రామయ్య మొగులు తెగినట్లు "బిడ్డ పైలమన్నది బిడ్డా...! నీ కడుపు చూసేది బిడ్డనే అయ్యా...!" అని తలుచుకుంటూ ఏడుస్తున్నాడు.

కొడుకులూ, కోడండ్ల ఏడుపును చూసిన పక్కింటి కొండపురం మల్లవ్వ "కట్టపడి కట్టపడి ఏడువుంర్డి. కండ్లకు నీళ్లురాకా? కడుపుల ఆత్మలేక? ఉమ్మి తడి పెట్టుకొని ఎక్కిళ్లుపట్ట ఏడువుంర్డి."అని మాటల్నీ ఈటెల్లా ఏర్పడకుంట విసిరింది.

ఆ మాటలు విన్న కనకవ్వ చిన్న కోడలు మండే కొర్రయిలా మారేసి మారేసి మల్లవ్వకు సురుకు పెడదామని చూసింది. "అగాగు... ఇది సైమమం కాదు బిడ్డా..." అని భుజమ్మీద చెయ్యేసి వారించింది పక్కనే ఉన్న దూరపు చుట్టం. అంతటితో ఆగిందిగానీ లేకుంటే తన తడాక చూపి ఇల్లుపీకి పందిరేసేదే.

స్వాతంత్రం వచ్చిన కాలం నాటిదా అని అనిపించే ఒక డొక్కు ఆటో కుటుకుటుమనుకుంటూ పొగలు గక్కుతూ, లొడలొడ శబ్దం చేస్తూ, పాండవ రోగం వచ్చిన మనిషిలా ఒళ్లంతా గజగజ వణుకుతూ వచ్చి వాకిట్లో టెంట్, కుర్చీలతో ఆగింది. ఆటోలో వొచ్చిన ఇద్దరు పిల్లలు టక్ టక్ చప్పుడు చేస్తూ కుర్చీలు దించుతున్నారు. మమేకమై ఏడుస్తూ బీరిపోయినోళ్లను ఇటు జరుగుమనీ, అటు జరుగుమనీ నాలుగు మూలలకు నాలుగు సీకులు పాతి టెంట్ వేసింర్డు.

వయసోళ్ళు, ముసలోల్లు అందరూ కుర్చీలల్ల కూర్చున్నారు. పెద్దమనిషి పెర్మయ్య ఏమేం పనులు చేయాల్నో అన్నీ పనులు కూర్చున్నకాన్నించి గుర్రాలు మలిపినట్లు పనులను పంచి చెప్పుతుండు.

"ఎల్లయ్యా! నువుపోయి మాద్గులకు చెప్పి, కాడుకు కట్టెలు కొట్ట రమ్మనాలె. డప్పులు తీసుకు రమ్మనాలే. వాళ్ళు జమకూడి, పిలుసుకోవాల్నాయే. అట్లనే మాలోళ్ల మల్లయ్యకి చెప్పాలె. కాడు పెర్వాన్నాయే. కావాలి ఉండాల్నాయే. పాడె కట్టలు దేవాల్నాయే"

విచారంలో మునిగిన లస్మయ్యను చూసి "అరే లసుమయ్యా! అందరం గండ్లకే పోతం ఎనుకాముందు. పెద్ద కొడుకు పోచయ్య తడిబట్ట తానం చెయ్యాలే. కట్టే ఎయ్యాలే. ఆ పని కానిద్దాం." అని పెర్మయ్య చెప్పుతుండు.

గోనయ్య కొడుకు రాజుని పిలిసి "మీ పొత్తుల సుట్టాలకు, మీ సుట్టాలకు చెప్పింర్డా? ఫోన్ చెయ్యింర్డి. చెప్పకపోతే చెప్పుమను." అని చెప్పిండు. రాజు "సరే తాత!" అనుకుంటే వెళ్ళిపోయాడు.

"ఎవర్నీ నొచ్చినా నోట మాటన్నే. అది పడలే..." అని ఆకరి సూపుకు వొచ్చిన పటేండ్ల రత్నవ్వ కనకవ్వ గురించి కితాబిస్తుంది.

ఆమెతోని అనుబంధం ఉన్నోళ్ళు కనకవ్వను ఆకరుగా చూసేతందుకు, కొడుకులకు దాయకమైనోళ్ళు, దగ్గరోళ్ళు ఊరు ఊరంతా కడప తప్పకుండా కదిలింర్డు ఊల్లోని ఛోటా మోటా లీడర్లతో సహా...

వచ్చేవి స్థానిక సంస్థల ఎలక్షన్లు. ప్రతీది అనుకూలంగా మార్చుకోవాలనీ ఉవ్విళూరుతున్నారు నాయకులు. ఇంతకు ముందు అధికారములున్న లారిగుర్తు పార్టీ తాజా మాజీ సర్పంచ్ రెడ్డి పదిమందితో రాకడను చూసి లేసి నిలవడిరి కనకవ్వ కొడుకులు.

'గోనయ్యా! పోచమల్లు, ఎల్లంలకు ఏమన్నా ఇయ్యకపోతడా? ఖచ్చితంగా ఇస్తడు' అని అనిపించింది.

"ఏం చేస్తమే... అమ్మకు కానీ రోగమొచ్చింది. సేవలు మీరు చేయకపోతే ఎవలు సేసింర్డు? ఏడువకుంర్డి. ఎమ్మెల్యే సారుకు్కూడా ఫోన్ చేసి చెప్పిన. సారుకు వీల్కెత లేదట. ఇగో... పదివేలు పంపిందు సార్... నేనో ఐదువేలు కలిపి" అని ఐదువందలవి ముప్పై నోట్లు మడతకు మడత తీసి కర్సులకుండనీ" అని పెద్దమనిషి పెర్మయ్య సేతుల పెట్టిండు ముగ్గరన్నదమ్ములకు ఎవరికీ దుష్మాన్ కావొద్దనీ..

"చూసింర్డా! మిగతా పార్టీ వాళ్ళు ఎవరైనా వచ్చింర్డా! ఎందుకొస్తరు? రారు. వాళ్ళు మనుషులు అయితేనేమో వద్దురు" అని రెడ్డన్న పెదవి విరుస్తున్నారు

ఇచ్చిన డబ్బుల్నీ చూసిన కొంతమంది 'రెడ్డన్నంటే లీడరే. దానకర్ణుడు. ఈ ఊరికి ఆయిన్నే పెద్దదిక్కు. ఆయనది ఎముకలేని చేయి' అని రకరకాలుగా కీర్తిస్తుంర్డు.

'మూడు కుటుంబాల్లోని అందరికీ కలిపి మనిషికి పదిహేను వందలు ఇచ్చిన' అని మనసులో అనుకుంటున్నాడు రెడ్డి. పక్కనే ఉన్న కారోబరికి డెత్ సర్టిఫికెట్ ప్రాసెస్ చేయుమని పురమాయించిండు.

"అమ్మ పేరుమీన జాగుందా! మన ప్రభుత్వం ఉండంగా ఇంటికి వొచ్చి అయిదు లక్షలు రైతు భీమా ఇత్తురు. మనూల్లె

ఎంతమందికి రాలేదు. ఈ మోచేయి పార్టోల్లు ఇస్తనేలేరు ఎక్కి ఆర్నెల్లాయే. రైతు భీమకు అప్లై చేద్దాం. ఆర్నెల్లకన్న రాకపోతదా?" అని రాని దుఖాన్ని మోకానికి అతికించుకొని తెగ సానుభూతి తెలుపుతుండు.

"అన్నా! రైతు బంధుకూడా పడుతలేదే." అని ఆ కాలనీ లీడర్ లింగం చెప్తాండు.

"రైతు బంధులేదు, కళ్యాణలక్ష్మి లేదు. దవఖాన కిట్ లేదు. కరెంటు కూడా ఉంటలేదు. అన్నా! దాన(దహన)మైనంక స్నానాలకు కరెంటు ఇదువుమనాల్నే" అనే లింగం కంటే నేనే తెలివిమంతున్ననీ ప్రవీణ్ ఏడు పొంగులు పొంగుతూ చెప్తుండు.

"అందరు చెప్పిన ముచ్చటగదే. మోచేయి పార్టోళ్ళకు ఓట్లు ఏస్తే ఏమైతదో చెప్పినా వినకపోయిరి జనాలు. ఏం చేస్తం. ఇంకెంతకుందో.. వాళ్ల పాలన మోచేయికి బెల్లంపెట్టి నాకుమన్నట్లు ఉంటది."అని రెడ్డన్న అంటుండు.

అన్ని తలలు గొర్రెలోలే నిజమేనన్నట్లు ఊపుతున్నాయి.

కనకవ్వ కుటుంబ సభ్యులను పరామర్శించిన రెడ్డన్న క్యాప్షన్‌తో ఊరు వాట్సాప్ గ్రూప్‌ల్లో ఫోటో ఒకటే గిరికీలు కొట్టింది. ఆ పార్టీ వాళ్లు దండాలు, సప్పట్లు కొట్టి ఎమోజీలతో నింపేస్తున్నారు

మోచేయి పార్టీ సానుబూతిపరులకు ఈ వార్త మింగుడుపడకుంట్కెంది. గ్రామధ్యక్షుడు కిట్టయ్యకి ఫోన్ కలిపిరి. కండువాలు ఏసుకొని ఆగమేఘాలమీద ప్రత్యక్షమైరి.

రాని విషాదాన్ని ముకంలో చిత్రించుకొని కనకవ్వ భర్తమీద, కొడుకుల మీదపడి తడికళ్లతో గద్గద స్వరంతో విచారం వ్యక్తం చేస్తున్నప్పుడల్లా వెంటొచ్చినోళ్ళు కూడా దు:ఖపడుతుండ్రు. మోచేయోల్లు వినూత్నంగా వుండాలనీ వస్తూ వస్తూ కూలికి ఏడిసేటోల్లని కూడా ఏర్పాటు చేసుకున్నారు.

"మన మోచేయి ఇప్పుడు అధికారంల ఉన్నది. రైతు భీమా ఇప్పిద్దాము. సర్కార్ నుండి ఏమేమి వచ్చెటియి ఉన్నయో వాటన్నిటిని ఇప్పిస్తా... ఇగవటు" అని మూడు వేల రూపాయలు పెర్మయ్యని పిలిచి చేతుల పెడుతూ...

"ఆ ఇత్తరుగనీ, రైతు బీమ మూసేసినంక ఎక్కడ నుంచి ఇస్తరు? వీల్ల ఇంట్లకేలిస్తరా? దొంగ మాటలు ఎందుకు?" అని ఇద్దరు వినీవినరాకుండా గులుగుతున్నారు.

"లారీ పార్టోల్లంత ఎన్నయినా, ఎంత్కెనా ఇస్తరు. తీసుకొండ్రి. వాళ్ళంత చోరులు ఏ రాష్ట్రంల లేరు. ఏ దేశములో లేరు. చెరువుల్లేకున్నా పూడికలు తీయించిండ్రు. ఇంటింటికి నల్లపథకం పెట్టి నల్లమొకమ్ జేసిండ్రు. చెరువుకట్టని పూదిచ్చిండ్రు పునాదిలేకుండా కట్టి. ఉంటదా? నాలుగు రోజులకే తొర్రలు పడ్డది. శారాన కోడికి బారాన మసాల ఏసినట్లు అగ్గువ కరంటిని పిరానికి కొన్నరు. మిగులు రాష్ట్రాన్ని అభివృద్ధి పేరున అప్పుల కుప్పగా మలిచిండ్రు. పానం ఉండగానే పీక్క తింటరు కాదు"అని అంటుండు.

'ఓరీ మోచేయి మొకపోడా! లారీ గురించి చెపుతున్నవా? సానుబూతి తెలుపుతున్నవా? ప్రచారం చేస్తున్నావా? ఏందిరా నీ ప్రాబ్లం' అని ఆలోచించి అక్కడ ఎవరూ లేకున్నా వాన్నేవన్నో పిలిచి "ఆగాగురా!" అనుకుంటా పోతండు రాజు.
లీడర్ ఫ్లో దెబ్బదిని ముచ్చటాపిండు.

"పెర్మయ్యా! మా మోచెయ్యోల్లు మీతో ఉంటరు. పెద్దమనిషి చావు ఘనంగా చెయ్యిండ్రి" అని చెప్పుతూ వెళ్లిపోయిండు బండి కిష్టయ్య. ఎవరో చుట్టాలొచ్చి రాగానే "బంగారి గుణమే అక్కో అక్కా..." అని ఏడుస్తున్నారు.

ఏడుస్తున్న దృశ్యాల్లో లాలాజలం ఊటలా కారుతుంది. సీముడుతో కొంగులు తడుస్తున్నయి. కొందరు దస్తి ముక్కుకు అడ్డంగా పెట్టుకొని నిల్చున్నారు. ఏడిసెటోల్లకు కన్నీళ్ళొస్తలేవు. మోచెయ్యోల్ల ఫోటోలు వాట్సాప్ గ్రూప్‌లో చెక్కర్లు కొడుతుంటే ధర్మం న్యాయమనే దండ పార్టీవాళ్ళకు, యూత్‌కి అసలే మనసున పట్టలేదు.

"అన్నా! మనం పోవాల్నే. రావాల్నే! లేకపోతే దండ పార్టీ గతేమైతదే? మన ఉనిక్కే ప్రమాదమైతదే? పార్టీకి మీరే పెద్దదిక్కు అన్న పోదాంపా...." అని బతిమాలిండ్రు కార్యకర్తలు. చావుల కాడికి పోవడం అంటే శ్రద్ధ ఉండని లీడర్ పరమేశ్వర్‌ని బలిమీటికి సావుకాడికి లేపుకొచ్చిండ్రు.

దండ పార్టీవాళ్లు వస్తూ వస్తూ తమ పార్టీ గుర్తు దండను తెచ్చి కనకవ్వ మెడలో వేసిండ్రు. జరసేపు కండ్లకు నీళ్ళు పెట్టుకొని మౌనం వహించిండ్రు.

ఉబ్బు ఆగని యువకుడొకడు ప్రొద్దున ఆన్‌లైన్‌లో గోవింద నామస్మరణ చేసినది గుర్తుకొచ్చి "గోవిందా.. గోవిందా..." అని అరిచేసరికి వొచ్చినోళ్ళు కూడా "గోవిందా... గోవిందా..." అని నాలుక్కరుచుకున్నారు.

"అయ్యయ్యో ఎంత పనయింది? ఎట్లా జరిగింది. ఎట్లా చనిపోయిందో కనకవ్వ కొడుకుల్ని అడిగి తెలుసుకున్నరు.

"పెర్మయ్యా! అంతిమ కార్యక్రమము ఎలా జరుగుతుంది? ఉత్తర క్రియలతోనే మోక్షమ్మరి. జాగ్రత్తగా నిర్వహించు"మన్నరు.

ఎవలడుగుతరో చెప్పుదామని ఎదురుచూస్తున్న పెర్మయ్యకు ప్రాణం లేచి వొచ్చింది. గడ్డిబండి కింద పొయే కుక్క గడ్డి బండిని మోసినట్లు బిల్డప్ ఇస్తూ... "తడిబట్ట తానం చేయించి కట్టే వేయించిన. కుమ్మరోళ్ళ ఇంటికిపోయి కుండలు తెప్పిచ్చిన. కొత్తబట్టలకు, ప్యాలాలకు పంపించిన. వీళ్ళు పట్నాలు ఎక్కింగ్రు. బ్కెండ్లోల్లకు మతులవు చేయించిన. అన్నీ తప్పినా పద్ధతి తప్ప. అన్నీ పద్ధతి ప్రాకారం చేయిస్తా సారు." అని నమ్మకంగా జవాబిచ్చిండు.

"మనక్కావలిసింది గదే!"

ముచ్చట వింటున్న పరమేశ్వర్ చెవిలో లారీ పార్టోల్లు, మోచేయి పార్టోల్లు పైసలు ఇచ్చిన ముచ్చట చెవుల చెప్పింగ్రు. పూనకం వొచ్చినట్లు ఒక్కసారిగా పరమేశ్వర్ శేకైండు.

"నీతికి, న్యాయానికి, ధర్మానికి, ఆచారానికి కట్టుబడ్డ పార్టీ మనది. అన్నీ పద్ధతి ప్రకారం జరుగాలే. పదేళ్ళు పాలన పేరు మీద పైసలు మింగినోడు పంపడా? అరువై ఏళ్ళు ఏండ్లు పండ్లు అరిగేదాక తిన్నోడు వుట్టి చేతులతోటి ఎట్లోస్తడు? దగ్గరుండి సావుచెయ్యాలే. వీళ్ళిద్దరు లఫంగలు, లత్కోరులు, దేశాన్ని, రాష్టాన్ని ముంచింగ్రు..." అని బూతు పురాణం అందుకున్నాడు.

'ఓ రెండు వెయ్యిలు ఇచ్చినా అయిపోవు. ముచ్చట పెట్టినోడు బిచ్చం పెట్టడం అన్నట్లే ఉంది కదా! ఈయన ముచ్చట.' అని గోనయ్య మదిలో అనుకుంటున్నాడు. ఆ కాలనీ యూత్ సంతోషపడుతున్నారు.

ఆపతికి సావులకు పిలిచినా వొస్తడు. పిలువకున్నా వొస్తడు. అతడే ఒక సైన్యంలా పేరువోయిన కమ్యూనిస్ట్ కుంటయ్య. పైసలియ్యడు. కాకపోతే సావు అయ్యేదాక వుంటడు. వర్గ దృక్పథం వదిలి వర్గ కుల స్పృహ కలిగిన నిఖార్సైన బహుజన పూలే వారసుడు.

చచ్చిన కనకవ్వ మొకమ్ చూసి దండం పెట్టిండు. చెయ్యెత్తి పిడికిలి బిగించి, జై భీం అన్నడు. అట్లా అన్నందుకు పాతోల్లకు మామూలేకాని కొత్తోల్లు ఆశ్చర్యపడ్డరు.

"పార్టీ అంటే మనదిరా! బతికినా సచ్చినా తోడుంటది. అంతా మన పెద్ద సార్ గొప్పతనంరా... లారి పార్టీ యువజన నాయకులు మహేష్, నవీన్‌లు సంతోషంతో చర్చిస్తున్నారు. మనం పిలిసినందుకు రెడ్డన్న వచ్చి పదిహేను వేలు ఇచ్చిండురా? విలువిచ్చే పార్టీలో ఉండాలే అడ్డమైన పార్టీలల్ల, అడక్కతినే పార్టీలల్ల ఎందుకుండాలే?" అని డిస్కస్ చేసుకుంటున్నారు.

మోచేయిపార్టి యూత్‌లీడర్ నరేష్ విని "అరేయ్! మాది అడ్డమైన పార్టారా? అడక్కతినే పార్టారా? ఔలగా మేం లేకపోతే అభివృద్ధి ఎక్కడిదిరా? మాతోనే దేశం మొదలైంది కాదురా? మాటలు మంచిగరాకపోతే తొక్కుత. మమ్ముల తక్కువ చేసి మాట్లాడుడేందిరా నాన్సెన్స్." అని గుడ్లు దెరిసి గట్టిగ అరుస్తున్నాడు.

"నిన్నేం అనలే. నీ పార్టీని ఏమనలేదురా... లావు ఎగురుతున్నవేందిరా???" అని మహేష్ అంతే స్థాయిలో జవాబిచ్చాడు.

"మీ పార్టీ లీడర్ మీసాల్లేని బోడెక్కరా? బడివే... వాని సంక నాకుపోంగ్రి. మా నాయకుడు పేగులు మెడలేసుకుంటాడు రా" అని నరేష్ అన్నడు.

"పేగులు మెడలేసుకోను మీ నాయకుడు ఏమన్నా కటికోడా రా !అరేయ్! దొంగలకు వండిపెట్టినోడురా? ముల్లెలు మూటలు మోసి పోలీస్ టౌన్‌ల పడ్డడు కాదురా? దొడ్డిదారిన, గంటలు గనశూలాలు తాకంగా పైకొచ్చిండురా... పొద్దాక కొలువుంగ్రి. మీ మోచేయి లీడర్ మా సార్ మోకాలు కాడికి లేడురా " అని నవీన్ తిట్లందుకున్నాడు.

"గట్టోడేరా? ఒక్కపెట్టుకే లొటపెట కూలినట్లు మీ లీడర్‌ని మీ పార్టీని కూలగొట్టింగ్రా. ఇంకా సిగ్గు లేదారా? జలగలా పీల్చుక తిన్నది సాలదారా..." అని నరేష్ తిడుతుండు.

లొల్లి ఎక్కువయింది. గల్లగల్లలు పట్టుకున్నరు. కొట్టుకోను మోపైంగ్రు. రాజలింగం ఉరుకొచ్చి "ఆగుంగ్రి. ఆగుంగ్రి తమ్మీ! నా మాట ఇనుంగ్రి. మనం మనమొకటి" అని బతిమాలుతండు. ముగ్గురినీ బల్మీటికి విడదీసిండు. బుజ్జగించిండు. పంచాదిని ఆపిండు.

ఈ కొట్లాట పార్టీల కొట్లాటగా మారింది. మోచేయి పార్టోల్లు, లారి పార్టోల్లు జమైతంగ్రు.

"వొదిలిపెట్టు ఇయ్యాల్ల వాళ్లో, నేనో సూసుకోవాల్సిందే. వాడు మా మోచేయి పార్టీని తిడతడా? దేశం పుట్టక ముందునుంచే ఉంది. మిమ్ముల మీ పార్టీని పండపెట్టి చీరుతం కొడకా! ఏమనుకుంటున్నావో.." అని నరేష్ ఎనుములా కాలుదువ్వుతుండు.

ఈ కొట్లాటను అందరు కటారా (గుంపు) కట్టి చూస్తున్నారు. పీనుగు వద్ద ఎవ్వల్లేరు కనకవ్వ బిడ్డ తప్ప.

రాజలింగం పెద్దోడు. విద్యావంతుడు. పట్నంలో ఉంటున్నాడు. అతను సావుకొచ్చాడు.

"రాజలింగన్న రాకుంటే నీ పెండ్లి చేద్దుం. డొక్క చించి డోలుకడుదుం. మా సార్‌ని మీసాల్లేని బోడక్క అని తిడుతడా... వాడెంత? వాని పార్టీ ఎంత ? అరేయ్ మా సార్ డిల్లీని గజగజలాడించిండు. థూ నువ్వెంత నీ బతుకెంతరా? నీ పార్టీని ఒక్క తన్ను

తన్నిందురా బద్మాష్" అని మహేష్ నవీన్ లు మూకుమ్మడిగా అరుస్తుంౘ్రు.

లొల్లితో సావుకాడ ఉన్నోల్ల సూపంత ఇటుదిక్కు వడ్డది.

రాజలింగం రెండు పార్టీలోల్లను కన్విన్స్ చేసి ఆపిండు. "ముందు వినుండ్రి. ఇది పార్టీల లొల్లికాదు. మనలొల్లి. మన కులంది. మన పాలోల్లది. పాలోల్లంటే ఒక్క కుటుంబం కదా! కోపం వద్దు కొట్లాటొద్దు" అని నమ్మకం కలిగించిండు.

"మనమ్మనం ఒక కులం. అంతేనా? కాదా?"

అందరు అవుననన్నట్లు తలలూపారు.

"పార్టీల వాళ్లు సహకారం అందించిండ్రు సరే. అది అంతటితో వదిలేద్దాం. నిజం తెలుసుకోండ్రి. నిజం చేదుగా ఉంటది. నిజం నిప్పుగా ఉంటది పార్టీలకోసం పంచాది పెట్టుకుందామా? మన పాలివాల్లం చుట్టిపట్టుడు, స్నానాలు చేసుడు, తలలు కొరిగించుడు మానుకుందామా ఎవరికోసమో? చెప్పుండ్రి.

మనము లేంది పార్టీలు లేవు. ప్రచారాలు లేవు. ఓట్లు లేవు." అని మూడుసార్ల చెప్పి వాళ్ల వైపు చూసి చూపులతో ప్రశ్నించాడు.

మహేష్, నవీన్, లు తలదించుకుని స్తబ్దంగా ఉన్నరు. నరేష్ కూడా శూన్యంలోకి చూస్తూ నిశ్శబ్దంగా ఉన్నడు.

వర్గకుల దృక్పథం అలవర్చుకున్న కమ్యూనిస్టు కుంటయ్య రాజలింగం దిక్కు చూసి ఆగుమనీ...

"ఇది సమయం కాదు. నేను మాట్లాడేది ఏదైనా పచ్చిపచ్చిగా పిచ్చిగా అనిపించవచ్చు కాని వాస్తవం ఆలోచించండి. ఎవడో ఆడిస్తే ఆడకుండ్రి. అంబేద్కర్‌ని, రాజ్యాంగాన్ని చదువుండ్రి. ఎవడికీ చెంచాలుగా ఉండొద్దు. అధికారం అందుకోలేని జాతులు అంతరించి పోతాయి. హక్కుల కోసం బిచ్చమెత్తకండి పోరాడి సాధించుకొండి. రాజ్యాధికారం కోసం బోధించి, సమీకరించి, పోరాడండి. అన్ని వాదాలు చదివి అసల్కైనవాదాన్ని ఎంచుకొండి." అని ప్రారంభించగానే.,.

"ఆ ఇగ వొదువది ఈ ముచ్చట" బొంబాయి రాములు అన్నాడు.

"నిజం తెలుసుకోరు. నిజం వినరు. మధ్యలో అడ్డగాళ్లు ఎందుకేస్తున్నవోయి? రాములు నువ్వు ఊకో" అని కుంటయ్య కోపాన్ని ప్రదర్శించాడు. దెబ్బకి నోరు మూసుకున్నాడు రాములు.

"ప్రజాస్వామ్య తెలంగాణ కోసం కొట్లాడినోల్లం. సబ్బండ వర్ణాలు కలిసి సమరం చేసిన వాళ్ళం. బరి గీసి ప్రాణాలకు తెగించినోళ్ళం. పన్నెండు వందల అమరుల త్యాగాలు ప్రజాస్వామ్య తెలంగాణను తేలేకపోయాయి ఎందుకో ఆలోచించాలె. నిరుద్యోగం అట్లనే ఉంది. స్త్రీలకు సంపూర్ణ స్వేచ్ఛ వచ్చిందా? వస్తే అఘాయిత్యాలు ఇంకా ఎందుకు కొనసాగుతాయి? అంటరాని ప్రేమ లు ఆహుత అవుతున్నాయి. ఈ రాజకీయము చూసినారు? ఎవని డబ్బా వాడే కొట్టుకుంటుండు. చేసినవి గోరంత చెప్పేవి కొండంత.

కత్తులు దూసుకుని కలబడుతున్నని నమ్మబలికి కచీర్ కెక్కినాడు. పెద్దాయన దిగిపోయి జాలాట్ల పడితే తలాపున కూసుండి ముచ్చట పెడుతడు. రాజకీయం రంగు తెలుస్తలేదా? వాళ్లకి లేని కొట్లాటలు మీకెందుకు?" అని కుంటయ్య వాస్తవాలు చెప్తున్నాడు.

అక్కడున్న వాళ్లు కరెక్ట్ పాయింట్ చెప్పిండు రా

ఈ ముచ్చటైతే నిజమే రా అని గుసగుస పెట్టుకుంటున్నారు.

ఈ తెలంగాణలో ఒక్కొక్క రాజకీయ నాయకుడు వేల కోట్ల ఆస్తుల్ని కూడ పెట్టారు. కూడపెడుతున్నారు. ఎవరికోసం వాళ్లకోసం కాదా? వాళ్ల కోసం మనం ఎందుకు పనిచేయదును పెట్టుకోవాలి! కేసులకు తిరగాలి? మీరే ఆలోచించుండ్రి.

మనమేసే ఓటు మనకోసం ఉపయోగపడుతలేదు. దొర కాకపోతే రెడ్డి, రెడ్డి కాకపోతే దొరకాదు. మనకు ప్రజాస్వామ్య తెలంగాణ కావాలి. భౌగోళిక తెలంగాణ కాదు బహుజన ప్రజాస్వామ్య తెలంగాణ అంటివి ఎటువాయే? ఏ ఏమాయే? ఎవడు ఎత్తుకుపాయే? ఉద్యమంలో లేనోడు ఊకదంపుడు మంత్రులైతుండ్రు. చిలకపలుకుల ఉపన్యాసం ఇయ్యవట్టిరి. మనకోసం మనం నిలువాలే. మనకోసం గెలువాలే. ఎవనివనికో వీరాభిమానులమై కొట్టుక సావొద్రా నాయనా!"అని చెప్తున్నాడు.

మహేష్ నవీను నరేష్ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నారు.

ద్వేషభావాన్ని చెరిపేసుకుంటున్నారు.

" ప్రస్తుతం మనం చావులో ఉన్నాం. ఈ సావులు వద్దు. శవ రాజకీయాలు వద్దు. మేల్కోకపోతే నిజంగానే మనల్ని చంపేస్తారు. జర ఆలోచించుండ్రి. లేకపోతే మీ ఇష్టం" అని నిర్ణయాన్ని వారికి వదిలేసిండు కుంటయ్య.

ఇప్పుడైతే కనకవ్వ చావు చేద్దాం. అధికారం అందిపుచ్చుకొని బతుకుదాం...

పోదాం పండి అనగానే అందరూ వెళ్లారు శవయాత్ర చేయడానికి.

డా॥ సిద్దెంకి యాదగిరి 9441244773

ప్రజాతంత్ర వర్తమాన సాహిత్య సంచిక – 2024లో ప్రచురితం.